శ్రీ

# వేంకటేశ్వర ప్రార్థన

శ్రీత్యాడ - పూషవాడ్వీరప భూవల్లభకృతము.

ఇయ్యది

విశాఖపట్టణంబున

శ్రీశారదామకుట ముద్రాక్షరశాలలో

గ్రంథకర్త్తగారిచే

ముద్రింపించి

ప్రకటింపఁబడియె.

VIZAGAPATAM:

PRINTED AT THE S. S. M. PRESS.

1910.

శుభమస్తు.

# శ్రీ వేంకటేశ్వర ప్రార్థనాపదము.

శ్రీరామరఘురామా- సీతాపతేరామా- సాగిమొ్రొక్కు చునిన్ను- సన్నుతించెదనూ॥ ౧॥ హరినామ గిరిధామా - యార్తరక్షణకామా-అంజలిఘటియింతు- సౌదలనుతింతూ॥ ౨॥ నీపాపలమునుమిా- నీలవర్ణస్వామిా-కాపాడిసిరులిమ్ము- కరుణతోమమ్మూ॥ ౩॥ మూావకవాహనా- ముల్లోకమోహనా- మొ్రొక్కెదసుచరితా్రా- ముక్కంటిపుతా్రా॥ ౪॥ వెనకయ్యనీకన్నా- ఘనులెవ్వరికన్నా- నినుఁదలంచకయున్న- పనులుగావన్నా॥ ౫॥ నీకటాక్షమునింపూ- నిర్విఘ్నమొనరింపూ- మాకుఁబాలింపు మిా-లోకమునఁబెంపూ॥౬॥ నలువపట్టపురాణీ- నవలాశిరోమణీ- వలుకులపూబోణీ- జలజాతపాణీ॥ ౭॥ తలచివేఁడెద నిన్నూ- దయజూడవేనన్నూ- తలవాకిటవసించీ- తప్పుసైరించీ॥ ౮॥ భారతీ నానోటా- పాడించుమిాపాటా - సభవారుమెచ్చఁగా - చప్పుట్లుపడగా॥ ౯॥ వేదుకలొనగూడా - యేమకొండలజేఁడా - వినుముమాతోగూడ- వేంకటేశ్వరుఁడా॥ ౧౦॥ వాడుకగామాకూ- మూఁడు మూఁడేండ్లకూ - ప్రార్థనపేరుననూ - భక్తులందఱునూ॥ ౧౧॥ పూజింపుచుందురీ- పుడమిలోపలవారీ- కాపాడుచుం

దువు- కరుణతో నీవు॥౧౨॥ ఆవిధాయకముగా- నర్చనల్
సేయఁగా - సరభసంబున మేము - సమకట్టినాము॥ ౧౩॥
శుక్రవారము నేడు- సూర్యుండు గ్రుంకఁగా- భక్తియుక్తము
గాను- భజన సేయుచును॥౧౪॥ కృష్ణజాతువని యెంచి- యు
పవాసము నరించి-స్నానాలు గావించి-సంతసము మించి॥౧౫॥
పొలుపైన హారంబట్టు- పట్టముల్ ధరియించి- తీరుగాను దిటి
పై తిలకముల్ దీర్చి॥౧౬॥ కలరీతిగా నలం-కారముల్ ధరియిం
చి- గురుతు మీరగ హెచ్చి- గోమయము దెచ్చి॥ ౧౭॥ ఇళ్లు
వాకిళ్ల లికి- కళ్లాపులును చిలికి- చిగురుటాకులతోను- చిత్రం
బుగాను॥౧౮॥ ద్వారాల పందిళ్లు- తోరణంబులు గట్టి- ము
ద్దులు గుల్కగను- ముత్యాలతోను॥ ౧౯ ॥ పరమపదవా
కిలి- తిరు తేరు ముగ్గులు - పరమపాత్రము ముగ్గు - బ్రహ్మ
ముడి ముగ్గు॥ ౨౦॥ శ్రీరంగకోట ముగ్గు-గారాజు ముడి ముగ్గు
- తలదిండు ముగ్గు బృం-దావనము ముగ్గు॥౨౧॥ పూ
విమానము ముగ్గు- పుష్పమాలిక ముగ్గు-శివుని జడ ముగ్గు
కా-శీగుంట ముగ్గు॥ ౨౨॥ కమలపట్టము ముగ్గు-ఘ
నకిరీటము ముగ్గు - నాగులు ముగ్గు క - ళాగొత్తి ముగ్గు॥
౨౩॥ యాగవాటిక ముగ్గు-యలరు జాంపము ముగ్గు-హో
మగుండము ముగ్గు- ఉయ్యాల ముగ్గు॥ ౨౪॥ పానుపు ముగ్గు
వి-వాహ వేదిక ముగ్గు-పసిమి చిక్కుడు కాయ-పందిరి ముగ్గు॥ ౨౫॥ శంఖచక్రము ముగ్గు - చంద్రసూర్యుల ముగ్గు -
పూచెండు ముగ్గు చె- బ్బుగోరు ముగ్గు॥ ౨౬॥ తామర

ముగ్గు ము- త్యాలసందిరిముగ్గా- పొంకమై వెలుగొందు -
టెంకాయముగ్గా॥ ౨౭॥ అందంబుగానుంచీ- యతిభక్తిచే
మించీ- చేతులుజోడించీ- జోతలొనరించీ॥ ౨౮॥ దాసులం
దఱుగూడీ- దయసేయుమనివేడీ- నీరాకకై వారు- నిలచియు
న్నారయా॥ ౨౯॥ రావయ్యరావయ్యా- రావేలమాజియ్యా-
యేలరాకున్నావో- యెక్కడున్నావో॥ ౩౦॥ దేవేంద్ర దే
వతలు - దేవదేవాదులూ- నీమాయదెలియంగా- నేరరల
రంగా॥ ౩౧॥ శ్రీదేవిభూదేవి- చెలంగినీళాదేవి- సేవలుసేయం
గా- చిత్తమలరంగా॥ ౩౨॥ పాలమున్నీటిలో- పలశేషశయ్య
పై- యోగనిద్రాస్థలా- నుంటివో చాలా॥ ౩౩॥ సోమకాసు
రుడ్రవచ్చీ- శ్రుతులుబ్రహ్మకునిచ్చీ- మచ్చమైజలధిలో- మసలు
చున్నావో॥ ౩౪॥ తరికొండవేడ్పునను- ధరియించిబడలికనూ-
కూర్మమైపుడమిలో- గూడుచున్నావో॥ ౩౫॥ ధరముట్టుకొని
పోవు- దానవేంద్రునిద్రుంచీ- వరహావతారమై- వసుధనున్నా
వో॥ ౩౬॥ భక్తకశ్యపుజంచీ - ప్రహ్లాదునరక్షించీ - నరసింహ
మూర్తివై- నగమునున్నావో॥ ౩౭॥ బలిచక్రవర్తిని- పాదంబు
ననడంచీ- వటుడవైవాని వా- కిటనిలచినావో॥ ౩౮॥ ఇలనవని
యొకమారు- నిలరాజులనుజీరి- పరశురాముడవగుచు- శర
ధినున్నావో॥ ౩౯॥ రావణాదులద్రుంచీ- రాజ్యంబువిరమిం
చీ- రఘుపతివై వేమ- రహితమైనావో॥ ౪౦॥ బలరామమూ
ర్తివై- యిలనక్కడున్నావో- అలప్రలంబాసురుని- హతము
గావించీ॥ ౪౧॥ కాలుచేతులులేక- కలిబుద్ధహానై- నీలావ

లమునందు- నిలచియున్నావో॥ ౪౨॥ కలికావతారమై-యి
లనెక్కడున్నావో - ఖలులైనమ్లేచ్ఛులను-ఖడ్గమునద్రుంచా॥
౪౩॥ కనుఁగొనలేమయ్యా- ఘనమైననీమాయా- కనికరమ్ము
నమ్ము- కరుణించరమ్మా॥ ౪౪॥ సరగుననీపూజా- సల్పుట
మావంతూ- గరిమతోడుతమమ్ము- గావనీవంతూ॥ ౪౫॥ త
ప్పనిసరిసుమా-దయనేగుదెంచుమా- యేడుకొండలుదిగీ-వే
డుకలదూగీ॥౪౬॥భక్తవత్సలుడంద్రూ-పండితుల్ పెక్కంద్రూ-
అదియథార్థముసేయా-నరుదెంచవయ్యా॥౪౭॥మముకృతార్థు
లజేయా- మాపాపములుబాయా- రక్షింపనీవుప్ర-త్యక్షమై
నావు॥ ౪౮॥ మకరికాకుండలా- మణికరీటములతో- రక్షిం
పనీవు ప్ర-త్యక్షమైనావు॥ ౪౯॥ శంఖచక్రగదాసి- చతురా
యుధములతో- రక్షింపనీవు ప్ర- త్యక్షమైనావూ॥ ౫౦॥ కౌ
స్తుభవనమాలి- కాహారకేయూరా- ధారివైనీవు ప్ర-త్యక్ష
మైనావూ॥ ౫౧॥ పసమించుజగడాలూ- పసుపువన్నియశా
లూ- దనరంగనీవు ప్ర-త్యక్షమైనావూ॥ ౫౨॥ భుజములందు
నమూల్యా- భుజకీర్తులలరారా- రక్షింపనీవు ప్ర- త్యక్షమైనా
వూ॥ ౫౩॥ రంగుగానలవేలు- మంగమతోగూడి- రక్షింప
నీవు ప్ర-త్యక్షమైనావూ॥౫౪॥ మాకోర్కెలలరారే- మా
నోములీడేరే-మేముధన్యులమైతి-మీనురాధీశా॥౫౫॥ మా
కులంబునుమేమూ-మాయిళ్లువాకిళ్లూ-నేడుపావనమయ్యె-
నీలవర్ణుండా॥౫౬॥ భవదంఘ్రిధూళి సం-పర్కంబుననుగదా-
రాతినాతయ్యెనో-రాజీవనేత్రా॥౫౭॥ దండంబుదండంబూ-

కొండలరాయుండా- వందనము వందనము- వాసుదేవుండా॥ జోహారు జోహారూ- మోహనాంబుదగాత్రా- జేమోద్బ్ర జేమోద్బ్ర- చిత్రచారిత్రా॥ ౫౯॥ సన్నుతులు సన్నుతులు- పన్నగాధిపశాయీ- మ్రొక్కెదము మ్రొక్కెదము- మోక్షప్రదాయీ॥ ౬౦॥ జేజేలు జేజేలు- శ్రీశేషగిరివాసా- చెంగనాలలవేలు-మంగమాధీశా॥౬౧॥ రత్నాలపీటపై-రమ్యంబుగానింపూ- రాణింపవసియింపూ- రాణితోడుతనూ॥౬౨॥ పలుకుసాంబ్రాణి గు- గ్గులధూపవాసనల్-గైకొనిముద్రోపూ- కరుణతోనీవూ॥ ౬౩॥ పన్నగాచలశాయీ- జన్నియావులనేయీ- దీపంబుదర్శింపూ- పాపములడంపూ॥ ౬౪॥ వీలుగాచంద్రునకూ- నూలుపోగన్నట్లూ- నైవేద్యమిదేనీకూ- దైవాలరాయా॥ ౬౫॥ ధరసముద్రునకుప్పా- దర్శనంబన్నట్లూ- నైవేద్యమిదేనీకు- దైవాలరాయా॥ ౬౬॥ చలిమిడివడపప్పా- చక్కెరబెల్లాలూ- జున్నుమీగడపాలు- జుంటితేనియలూ॥ ౬౭॥ తియ్యమామిడిపండ్లూ- తేనెఖర్జూపనస-తొనలరటిపళ్లు క- మ్మనిజామిపళ్లూ॥ ౬౮॥ కమలాఫలంబులూ- ఖర్జూరఫలములు- యిక్షుఖండంబులూ-దాక్షాఫలములూ॥ బహుపానకంబులూ - పంచామృతంబులూ - పాల్వాపిండీకిరసా - పంచభక్ష్యములూ॥ ౭౦॥ పాయసాన్నంబట్లూ- పంచదారొబ్బట్లూ- కక్కరాలుక్కెరాల్-కండచక్కెరలూ॥౭౧॥ అరిశలు గాజగా-యలు చంద్రకాంతలూ-జంతికచుట్టులు-జవుటులప్పాలూ॥ ౭౨॥ జిల్లేడగాయలూ- వల్లంకిమడుపులూ-

కలశండబూరెబూ- కజ్జముండాళ్లూ॥ ౨౩॥ పులిహోర చక్ర
పొం-గలియు దధ్యోదనము-నన్న పుటాలింపు-టన్నాలుచద్ది॥
౨౪॥ కలయుగాచిన నెయ్యి- కలమాన్నము నుప్పూ- శాక
ములపచ్చళ్లు-చారువడియాలు॥ ౨౫॥ అర్పించితిమి భక్తి- న
లవేలు సంయుక్తి- ఆరగింపుము వేంక-టాచలాధీశా॥ ౨౬॥ వి
శ్వింపగా జగ-త్కుక్షి విమాతండ్రీ- నీబొజ్జనింపగా- నేర్తురె
వ్వారూ॥ ౨౭॥ బత్తితో దుతనొక్క- పత్తిరియిడి మొక్క-
భక్తిముక్తులొసంగి-బోతువు చెలంగీ॥ ౨౮॥ పండుటాకులు మం
ది- పచ్చకర్పురతావి- బాగాలు ముత్యాలు-పచ్చిసున్నం
బూ॥ ౨౯॥ విడియము దేగ్గొమ్ము-వీడ్యంబొనర్పుము-యులవే
లుతో చాలా- యానందలీలా॥ ౩౦॥ కలికాలమునను దు-ర్గా
దేవియును నీవు- క్షితిని ప్రత్యక్ష దై-వతములనుమాటా॥ ౩౧॥
నిజమయ్యా నిజమయ్యా - నిశ్చయమోజియ్యా- దానుల పా
లింటి-దైవంబు నీవే॥ ౩౨॥ కరిరాజామకరిచే-గాసిలి ప్రార్థింప-
కరిగాచి మకరిని-బరిమార్చితీవే॥ ౩౩॥ పాంచాలిసభలోను-
ప్రార్థింపవస్త్రంబు- లక్షయంబుగనిచ్చి- రక్షించితీవే॥ ౩౪॥
ముక్కుటుకుల్లిచ్చి - మొక్కుకు చేలునకు - భూరిసంపదలి
చ్చి-బ్రోచినావీవే॥ ౩౫॥ జగములు బుట్టింప- తగురీతి బా
లింప- తెగువతో హరియింప- దేవుండవీవే॥ ౩౬॥ దండం
బు దండంబు-దాసులముదయయుంచి- ఆయురారోగ్య భా-
గ్యాభివృద్ధిగనూ॥ ౩౭॥ సంతాన సౌభాగ్య - వంతులుగాను
మ్ము- దీవించి పేంచేను- దివ్యతిరపతికి॥ ౩౮॥ దాసులందరు

గూడి- దోసిలొగ్గినుతింపా- యలవేలుతో గూడి- యతిసంభ్ర
మునను॥ ౮౯॥ భక్తులెల్లనుజేరి- భజనజేయుచునుండా- చ
నుముతొలికొండెక్కి-సంతోషమునను॥ ౯౦॥ కవగూడి ప
రమభా- గవతులుకీర్తింపా-యిలనురెండవకొండ-యెక్కి చను
దేవా॥ ౯౧॥ సురసమూహంబు క్రొ- వ్విరులువర్షింపంగా-
యిలనుమూడవకొండ- యెక్కిచనుదేవా॥ ౯౨॥ వందిమా
గధులుకై-వారముల్ సేయంగా-యిలనునాల్గవకొండ-యెక్కి.
చనుదేవా॥ ౯౩॥ రంభాది దివ్యాప్స-రసలు నాట్యముసేయ-
యిలను నైదవకొండ-యెక్కి చనుదేవా॥౯౪॥ తుంబురునార
దా-దులు బాడుచుండంగా-యిలనునాఱవకొండ-యెక్కి చను
దేవా॥౯౫॥ సందడిగా దేవా- దుందుభుల్ మ్రోవంగా- యి
లను నేడవకొండ-యెక్కి చనుదేవా॥౯౬॥ వేడుకలనుజొక్కి-
యేడుకొండలనెక్కి-వేంకటాచలముపై- వెలయుచున్నట్టి॥౯౭॥
నీదివ్యధామమునా- నిద్రచేకొని వేడ్క- నిజభక్తులను బ్రో
చు-నీకు మంగళమూ॥౯౮॥ అఖిలాండకోటి బ్ర-హ్మాండభాం
డోదరా- నిఖిలలోకాధీశా-నీకు మంగళమూ॥ ౯౯॥ సగుణ
నిర్గుణరూపా-విగతపాపకలాపా- నిగమార్థపందీపా-నీకుమం
గళమూ॥ ౧౦౦॥ మాటిమాటికి పాచి- పేటమిరాశిదార్-
కన్నయ్యపట్నాయు-డెన్నెన్నొగతులా॥ ౧౦౧॥ విన్నపం
బొనరింపా- వినివినిమనసులో- నాలోచనమొనర్చి-యంగీక
రించీ॥ ౧౦౨॥ నామభేదములతో- నటియింపుచున్నట్టి- దే
వుడొక్కడె యంచు-భావమునయెంచీ॥ ౧౦౩॥ ఏవిధంబున

నైన - దేవునికృతిసేయ - పావనంబనియెంచీ - బహుమోద మునమూ॥ ౧౦౪॥ హూణశకంబునం-దొప్పు పందొమ్మిది-వందల పదియవ-వత్సరంబుననూ॥౧౦౫॥ ఆచంద్రతారార్క-మవనిలో వెలుగొంద-భక్తులా మోదమున-పఠియింపుచుండా॥ ౧౦౬॥ ఈపదంబురచించే-నిలలోన శ్రీత్యాడా - పూష వాడ్వీరపా-భూవల్లభుండూ॥౧౦౭॥ వినినఁబాడిన వ్రాసి- నను వారలకు నెల్లా- శ్రీవేంకటేశ్వరుఁడు-సిరులిచ్చిప్రోవూ॥ ౧౦౮॥

శ్రీవేంకటేశ్వర ప్రార్థనాపదము సంపూర్ణము.



